శ్రీః

సున్దరకాణ్డ

# సర్గ – శ్లోక – క్రియానుక్రమణికాకోశః

కారణికః – **రామోరా**



**ప్రకాశకులు**

**శ్రీమతీ రావికృష్ణకుమారీ – మోహనరావు దంపతులు**

510, ఫ్రైడ్ బ్లాక్, ప్లాటినం కౌంటీ, హోసన్నా మందిర్ ఎదురు,

గోరంట్ల, గుంటూరు – 522 034. ఆంధ్రప్రదేశ్

శ్రీః

# సున్దరకాణ్డ

# సర్గ – శ్లోక – క్రియానుక్రమణికాకోశః

కారణికః – **రామోరా**

**ముద్రణ : 30-03-2023 శ్రీరామనవమి**

**ప్రతులు : 200**

**పేజీలు : 296**

**వెల రూ. : 300-00**


**RAVI MOHAN RAO, M.SC., M.A.,**
510, Pride Block, Platinum County,
Op. Hosanna Mandir,
Gorantla, GUNTUR – 522 034,
Andhra Pradesh,
Cell : 9440115411

**D.T.P. by:-**

L. Durga Prasad,
**Sanjay Graphics**,
CHIRALA – 523 155
Cell : 9573711454

Printed at -
**Akhil Printers**,
VIJAYAWADA.



ఈ కోశ నిర్మాణంలో నాకు అన్ని విధముల సహాయ సహకారాలను అందించి తోడ్పడిన **డా. ఎస్. శ్రీనివాసులు** గార్కి నమస్సుమాంజలులు.

'సుబోధినీ' వివరణసహితంగా ప్రచురింపబడిన 'సుందరకాండ' ప్రతిని ఆధారంగా జేసుకొని సర్గ శ్లోక సంఖ్యలను ఈ కోశనిర్మాణంలో పేర్కొనబడినవి. - రామోరా.



# హనుమ శబ్దస్వరూపుడు

(ఉ.వే.శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి ఉపన్యాసం ఆధారంగా)

**- డా. ఈ.ఏ. శింగరాచార్యులు**

రామాయణరహస్యజ్ఞం రమ్యవాక్యవిశారదమ్,
అనంతగుణసంఘాతమప్పలార్యమహం భజే.

హనుమ ఒక మంత్ర స్వరూపుడు, హనుమ గురుస్వరూపుడు. మంత్రమే హనుమ. ఎందుచేత? ఆ లోకంలో ఉండేటప్పుడు శ్రీమన్నారాయణుని గరుత్మంతుడు వహిస్తాడు. ఆ స్వామి ఎక్కడికి వెళ్ళినా గరుడుని ఎక్కివెడుతూ ఉంటాడు అని చెబుతూ ఉంటారు, కథలలో. ఏమిటి ఈ వాహనాలు? ఒకాయనకు ఎద్దు వాహనం, ఒకాయనకు హంసపక్షి వాహనం, ఒకాయనకు గరుత్మంతుడు వాహనం. ఏమిటండీ! ఏమిటో! ఈ దేవుళ్ళు ఎక్కితే, ఇవి ఎలా నిలబడతాయి? అని మనకి ఏమీ బుద్ధికి అందదు. ఏమిటి ఇవి? అంటే, ఆ వీటికి వేదాన్ని నిరూపకంగా చూపిస్తున్నారు. వేదంచేత వహింపబడి, మన దగ్గరకు వచ్చేవాడు భగవంతుడు. నీకు కావాలా భగవానుడు? ఒకసారి ఒక మంత్రాన్ని ఆశ్రయించు. ఆ మంత్రాన్ని మనసులో భావన చేస్తే భగవానుడు దానిమీద ఎక్కి నీ లోపలకు వస్తాడు. అనగా, భగవానుని మోసి తెచ్చి మనకు అందించేది వాహనం. అటువంటి వాహనమే ఈ శబ్దం. శబ్దాన్ని మనవారు వృషభంగా, గరుత్మంతునిగా నిరూపించారు అందుచేతనే, శివాలయానికి వెళితే నందీశ్వరుడు ఉంటాడు. విష్ణ్వాలయానికి వెళితే గరుత్మంతుడు ఉంటాడు. "వేదాత్మా విహగేశ్వరః" అయిన ఆయన సుపర్ణుడు, ఆయన ఛందఃస్వరూపుడు. ఆ వేదస్వరూపుడైన గరుత్మంతుని అధిరోహించి, భగవానుడు వస్తాడని విష్ణ్వాలయంలో ముందుగా గరుత్మంతుని చూపిస్తారు.

వృషభం వేదస్వరూపం. **"చత్వారి శృంగాః త్రయో అస్య పాదాః ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య, త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహాదేవో మర్త్యాగ్ మ్ ఆవివేశ"** అనే ఒక మంత్రం. ఆ మంత్రానికి పతంజలి వ్యాఖ్యానం చేస్తూ, శబ్దమే ఆ వృషభం అని అన్నాడు. ఆ శబ్దమనే వృషభాన్ని అధిరోహించి శివుడు వస్తాడు కనుక, ఆయన్ని సేవించడానికి ముందు ఈ వృషభాన్ని సేవించాలి.

ఆ విధంగానే భగవంతుని సేవించాలి అంటే, ముందు గరుత్మంతుని సేవించాలి. అందువల్లే, ఆ యా ఆలయాలకు ముందు గరుత్మంతుని, వృషభాన్ని ఉంచుతారు.

శివాలయానికి వెళితే మరొక లాంఛనం ఉన్నది. ఇక్కడ నమస్కారం చేసి వెళితే చాలదు. నంది కొమ్ముల మీద కొంచెం వంగి, వేళ్ళు పెట్టి, వాటి మధ్యలో నుండి చూస్తూ, శివలింగాన్ని దర్శనం చేయాలి. ఏమిటండీ ఇది? అంటే, ఇదే మనం నేర్చుకోవలసినది. ఇక్కడ మనకు పైన పెట్టినవాటికి అన్నిటికి అర్థం తెలిస్తే గాని, లోపలివాని అర్థం తెలియవు. బయట నందికొమ్ములు రెండు కనిపిస్తాయి. కొమ్ములు కాదు అవి. "చత్వారి శృంగాః" అని కొమ్ములు నాలుగు. రెండు కొమ్ములే బయటకు కనిపిస్తాయి. ఇంకో రెండు కొమ్ములు లోపల ఉన్నాయి. అదేమిటి? ఎద్దుకు నాలుగు కొమ్ములు ఏమిటి? అంటే,

అవి శబ్దాలు. మీరు కొంచెం మెల్లగా అనుకుంటే, లోపల వినిపించే శబ్దం ఒకటి, బయట వినిపించే శబ్దం ఇంకొకటి– అని రెండు శబ్దాలు ఉన్నాయి. వాటి వెనుక, నాభి ప్రదేశంలోనూ, నాభి కింద, ఇంకా రెండు శబ్దాలు ఉన్నాయి. ఆ కింద ఉండే శబ్దం ఎవరికి వినిపించదు. నిర్వికల్పసమాధిలో యోగులు మాత్రమే దానిని దర్శించగలరు, శ్రవణం చేయగలుగుతారు. దానికి **పరా** అని పేరు. నాభిస్థానానికి వచ్చిన తరువాత వినిపించే శబ్దానికి **పశ్యంతీ** అని పేరు. దీనిని సవికల్ప సమాధిలో యోగులు వింటారు. పైకి వచ్చిన తరువాత, మనం ఉపాంశువుగా అక్షరాలను వినపడకుండా మెల్ల మెల్లగా లోపల అనుకున్నా కాని, మనకు మాత్రమే, మన చెవులకే, వినబడేటట్టుగా, మన లోపల ఉచ్చరిస్తే వచ్చే ధ్వని పేరు **మధ్యమా**. ధ్వనిని ఉచ్చరిస్తే, ఈ నాలుక, పెదవులు, దంతాలు మొదలైనవి అన్నీ ఒకదానికి ఇంకొకటి తగిలి వచ్చే గాలిని ధ్వనులుగా బయటకి పంపిస్తే వచ్చే శబ్దానికి **వైఖరి** అని పేరు. ఈ వైఖరి అనే శబ్దమే మనకు వినబడుతుంది. ఈ విధంగా మధ్యమా, వైఖరి అనే రెండు శబ్దాలే బయటకు వినిపిస్తాయి. "ఆ శబ్దాల పైన, నీ చేయి పెట్టు లోపలికి చూడు, అంటే, శబ్దం ద్వారా భగవంతుని చూడు. అంతే తప్ప, వెళ్లగానే, నేరుగా అలా చూడకు. ఏదో కనిపించింది కదా అని దండం పెట్టకు." అని ఇక్కడ సూచించడమే ఉద్దేశ్యం.

ముందు ఆ ధ్వజస్తంభం దగ్గరకు వెళ్ళు. నమస్కరించు. ఆ తరువాత భగవంతుని దర్శించు. లేకపోతే, ధ్వజస్తంభం దగ్గరకు వెళ్లి ఆ విధంగా వంగడం ఎందుకు, తిన్నగా లోపలకు పోకుండా? ధ్వజస్తంభం దగ్గర వంగి దండం పెట్టాలి. అందుచేత, "ఓ వేదమా! గరుత్మన్! భగవన్! నీ అనుగ్రహంతో, నీచే వహింపబడే ,ఈ లోకంలోకి వచ్చిన భగవానుడు ఈ ఆలయంలోపల ఉన్నాడు. ఆయన మాకు దర్శనం ఇచ్చేటట్లు అనుగ్రహించు" అని ప్రార్థించు. అప్పుడు ఆ భగవంతుని దర్శనం లభిస్తుంది. భగవంతుడు నీకు దర్శనమిస్తాడు.

నేరుగా లోపలికి వెడితే, మ్యూజియంలో ఉండే విగ్రహాన్ని చూసినట్టు చూస్తావు కానీ, భగవత్తత్వం నీకు దర్శనం కాదు. లోపల స్వామి దర్శనం కలగాలంటే, ఆ స్వామి, ఆ స్వామి అని కనిపించాలంటే, ఈ వేద పురుషుని అనుగ్రహం కావాలి. అది మనకు తెలియజేయడం కోసం గరుత్మంతుని దేవాలయంలో పెట్టారు.

మరి, ఇక్కడకు భగవంతుడు ఈ లోకంలోకి శ్రీరాముడుగా దిగి వచ్చాడు కదా ఎలాగండి మరి? అంటే, వచ్చాడు మా హనుమంతుడు. "స్వామీ! నా భుజం మీద కూర్చో" అన్నాడు ఎక్కడైనా ఉందండి ఈ విచిత్రం! కోతిమీద ఎక్కే చక్రవర్తి ఎవడైనా ఉన్నాడా! కాని, ఎక్కాడు, మా రామచంద్ర ప్రభువు. కోతిని అధిరోహించాడు. ఏమిటిది? ఇది కోతి కాదండి. .ఈ హనుమంతుడు శబ్దస్వరూపుడే. మంత్రస్వరూపుడు ఈయనను అధిరోహించాడు, శ్రీరాముడు.

ఈ కోతి ఎలా పుట్టింది? ఆంజనేయ స్వామి జన్మను ఒకసారి తెలిస్తే, మంత్రం ఏ విధంగా ప్రాదుర్భవిస్తుందో తెలుస్తుంది. మహాపురుషులైన యోగులు, ఋషులు సమాధిలో కూర్చుంటే, లోపల నుండి శబ్దం వస్తుంది. శబ్దం అనేది ఎప్పుడూ ఉంటుంది. నిత్యమైనది శబ్దం, అఖండమైనది శబ్దం. "ఇటువంటి భావాన్ని ఆవిష్కరించాలి" అనే సంకల్పం కలగగానే, సంకల్పరూపమైన ఆ గాలి వెళ్ళి, శబ్దాన్ని కొడుతుంది. ఏ కెరటాలు లేని నీటిలో ఒక రాయి వేస్తే, ఏ విధంగా ఆ నీటిలో తరంగాలు వస్తాయో, ఆ విధంగానే వాయువు చేత కొట్టబడిన శబ్దంలోనుండి తరంగాలు వస్తాయి. ఆ తరంగాలు ఈవిధంగా పైకి ఉబుకుతాయి. అవి క్రమంగా బొడ్డు దగ్గరికి, హృదయ సీమకు, కంఠం దగ్గరకు వచ్చి, క్రమంగా పైకి ఎగసిపోతాయి. శిరస్సుకు తరవాత పైకి వెళ్లే మార్గం లేదు. కనుక, మళ్ళీ కిందకు కంఠసీమకు వస్తాయి. వాటిని, వోకల్ కార్డ్స్ అంటామే, అవి అడ్డుకుంటాయి. అప్పుడు నోటినుండి అవి బయటకు వస్తాయి. కంఠ సీమ నుండి కొన్ని అక్షరాలు,

అంగడి నుండి కొన్ని అక్షరాలు, నాలుక నుండి కొన్ని అక్షరాలు, దంతాలనుండి కొన్ని అక్షరాలు, పెదవుల నుండి కొన్ని అక్షరాలు, ముక్కు నుండి కొన్ని అక్షరాలు– ఈ విధంగా వేరు వేరు స్థానాలనుండి ఈ అక్షరాల సముదాయం అంతా బయటకు వస్తున్నది. ఇదంతా రావడం దేనివల్ల జరుగుతున్నది? ఈ శబ్దమే హనుమ. వాయువువలన పుట్టినవాడు వాయునందనుడు. శబ్దం వాయువువలన పుడుతుంది. అందుచేత, ఎవరండీ హనుమ? శబ్దస్వరూపుడు అందువల్ల, వేదం చదివేటప్పుడు, దానిని గురువు దగ్గర శిష్యుడు చెప్పుకునేటప్పుడు, **"శం నో మిత్రః శం వరుణః శం నో భవత్వర్యమా శం న ఇంద్రో బృహస్పతిః"** అని చెప్పిన తరువాత, "నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి, త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి తన్మామవతు తద్వక్తారమవతు," అని, "చెప్పే గురువును రక్షించాలి, చెప్పుకునే నన్ను రక్షించాలి"– అని వాయువును ప్రార్థిస్తే కానీ, నోట పలకడానికి వీలు లేదు.

కాబట్టి ఈ హనుమ మంత్రస్వరూపుడు. అతడు పుట్టగానే నేరుగా సూర్యుని దగ్గరకు ఎగిరాడు –అని కథ. సూర్యుడు ఎక్కడున్నాడు? నెత్తిపై ఉన్నాడు. ఆ పైకి ఎవరినీ వెళ్ళనివ్వడు, సూర్యుడు. అందుచేత కిందకు నెట్టి వేశాడు. అప్పుడు హనుమ ఏమయినాడు? నోట్లోంచి, దౌడల మధ్య నుంచి బయటకు వచ్చాడు. మీరు ఒకసారి గంభీరంగా మాట్లాడండి. దౌడలు సొట్టపోవూ! దౌడలు సొట్ట పోతే మనం ఏమైనాము?. హనుమాన్ అంటే, దౌడ కదిలినవాడు. అందుచేత, హనుమాన్ అయ్యాడు. ఈ విధంగా హనుమ అనే శబ్దం నాభి దగ్గర పుట్టి, బయలుదేరి పైకి ఎగసి, కిందకు వచ్చి, దౌడల మధ్య నుంచి బయటకు వస్తే, ఈ నాలుక ఆ యా భాగాలకు తగలడం చేత, వాయువును అదిమిపెట్టి మెల్లగా గట్టిగా వదలడంచేత అక్షరాలు బయటికి వస్తున్నాయి. కనుక, అక్షరాలు అభివ్యక్తం అవుతున్నాయి. వర్ణమనేది శబ్దం కాదు. **శబ్దం వేరు, నాదం వేరు, వర్ణం వేరు.** "అ" అని రాస్తే, అదేనా శబ్దం? కాదు. ఇది దాన్ని గుర్తించటానికి ఒక రేఖ మాత్రమే. ఈ రేఖను మనం " అ" అని ఉచ్చరిస్తున్నాము మరి ఏది శబ్దం? నోటినుండి అది ఉచ్చరింపబడుతున్నది. ఆ విధంగా ఉచ్చరింపబడేదానికి ఒక గుర్తు పెట్టారు. కానీ, గుర్తు శబ్దం కాదు. ఉచ్చరించే ధ్వని లోపలనుండి రావడానికి నిత్యంగా ఉండే శబ్దాన్ని అభివ్యక్తం చేశాం. . అంటే, అంతకు ముందే ఉండే శబ్దాన్ని వెలువరించాం. లోపల ఉండే శబ్దాన్ని నోటిలో నుండి బయటపరిచాము. ఎలా బయటపరిచాం?. ఈ లోపల ఉండే స్థానాల ద్వారా బయటపరచాం. అందుచేత వీనికి ఏమని పేరు పెట్టాలి. అంజన. హనుమ తల్లి పేరండి. హనుమకు వాయువు తండ్రి, అంజన తల్లి. ఎవరు ఇప్పుడు మన ఆంజనేయ స్వామి? అంజన అంటే వ్యక్తం అయ్యే చోటు. ఈ లోపల ఉండేటటువంటి స్థానాల నుండి, ఏ స్థానం నుండి అక్షరం వచ్చిందో మనకు తెలుస్తుంది. "ప" అంటే పెదవులు ముడవాలి. "ట" అంటే నాలుక చివర వెళ్లి అంగడికి తగలాలి. ఇవన్నీ ఉన్నాయండి. ఆయా స్థానాలనుండి వర్ణాలు అభివ్యక్తం అవుతున్నాయి. అంజన అనేది అభివ్యక్తం చేసే చోటు. అందుచేత అంజనకు, వాయువుకు సంపర్కంచేత పుట్టినవాడు మన హనుమ. ఈ శబ్దం కాదు, మొదట ఋషులనుండి సాక్షాత్కరింపబడిన, అపౌరుషేయంగా భగవంతునియొక్క నిఃశ్వాసరూపంగా బయటకు వచ్చిన శబ్దం అది. భగవంతుని నిఃశ్వాసమే వేదం. ఆ నిఃశ్వాసం శబ్దరూపమై బయటకు వస్తే వేదమై వచ్చింది అటువంటి వేదమే హనుమ. వేదాన్ని అధికరించినటువంటి మహాపురుషులైన గురువులే హనుమ. హనుమ జ్ఞాననిధి. అంతటి జ్ఞానాన్ని కలిగినవారు ఎవరూ లేరు. శ్రీరాముడు అతనిని పొగిడాడు. .అటువంటి జ్ఞాననిధి, వేద స్వరూపుడు అయిన హనుమ మన శ్రీరామునకు వాహనం. అందుకే భగవంతుని వహించి వచ్చే శబ్దాన్ని ప్రతిపాదించే కాండ **సుందరకాండ** అయినది.

* * *

# మాహేశ్వర సూత్రాలు..!!




పూర్వం పరమశివుడు నాట్యం చేస్తూ తన ఢమరుకాన్ని పదునాలుగు పర్యాయాలు మ్రోగించగా, ఆ శబ్దం నుండి పుట్టిన అక్షరాలను 'పాణిని' అనే ఋషి గ్రహించి, పదునాలుగు వ్యాకరణ సూత్రాలుగ రచించాడు.

ఈ సూత్రాలే **"మాహేశ్వర"** సూత్రాలుగా పిలువబడుతున్నాయి, ఆ సూత్రాలే అక్షరాల పుట్టుకకి ముఖ్య భూమికలు. ఈ శ్లోకం చూడండి..

నృత్తావసానే నటరాజరాజో |
ననాద ఢక్కాం నవ పంచవారమ్ ||          (నవ=తొమ్మిది. పంచ=ఐదు కలిపితే =14)
ఉద్ధర్తుకామః సనకాదిసిద్ధాన్ |
ఏతద్విమర్శే శివసూత్రజాలమ్ ||

అక్షరాలని సృష్టించి సూత్రీకరించింది పాణిని ఐతే, వాటికి వార్తికం వ్రాసినది 'వరరుచి'. వివరణాత్మకమైన భాష్యాన్ని వ్రాసినది 'పతంజలి మహర్షి.' అందుకనే

**వాక్యకారం వరరుచిం, భాష్యకారం పతంజలిం, పాణినిం సూత్రకారం చ ప్రణతోస్మి మునిత్రయమ్.!** అని ముందుగా పైముగ్గురు మునులకి నమస్కరించి, పూర్వం వ్యాకరణాన్ని, తద్వారా భాషని అభ్యసించేవారు. పదునాలుగు సూత్రాలని తెలుసుకొందాం. ఇవి పరమేశ్వరుడు చేసిన ఢమరుక శబ్దం నుండి గ్రహింపబడినవి.

**1 'అ ఇ ఉ ణ్' (అకార, ఇకార, ఉకారాలు)**

**2 'ఋ లు క్' (ఋకార అలుకారాలు)**

**3 'ఏ ఓం గ్' ( ఏకార, ఓకారాలు)**

**4 'ఐ ఔ చ్' (ఐ కారము, ఔ కారము)**

**5 'హ య వ ర ట్' (హకార, యకార, వకార, రకారాలు.)**

**6 'ల ణ్' (లకారం)**

**7 'ఞ, మ, ఙ, ణ నం' ( వర్గల యొక్క చివరి ఐదు అక్షరాలు )**

**8 'ఝ, భ య్' ( ఝకార, భకారాలు)**

**9 'ఘ,ఢ,ధ ష్' ( ఘకారం, ఢ కారం, ధకారం)**

**10 'జ, బ, గ, డ ద శ్' ( ఐదు అక్షరాలు )**

**11 'ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్' ( ఎనిమిది అక్షరాలు)**

**12 'క ప య్' (క & ప )**

**13 'శ ష స ర్'( శకార, షకార,సకారాలు )**

**14 'హల్' ( హకారం)**

ఈ పదునాలుగు మహేశ్వరుని సూత్రాలు.

ప్రతి సూత్రం చివర ఉన్న పొల్లు, హల్లులు సులభంగా పలకడానికి నిర్దేశించబడినవి. అట్లే అచ్చులు, హల్లులు కూడ ప్రత్యాహార సంజ్ఞతో సులభంగ అర్థమయే రీతిలో నిర్దేశించబడినవి. అవి తొలి సూత్రములోని మొదటి అక్షరం 'అ' నాల్గవ సూత్రములోని చివరి హల్లు 'చ్' కలిపితే 'అచ్' సంజ్ఞ ఏర్పడి, వాటిమధ్య ఉండే అక్షరాలని **'అచ్చులు'** అని వ్యవహరిస్తారని, ఐదవ సూత్రములోని మొదటి అక్షరం 'హ'ని గ్రహించి పదునాల్గవ సూత్రములోని చివర ఉన్న 'ల్' అనే పొల్లుతో కలిపితే 'హల్'అనే సంజ్ఞ ఏర్పడి వాటి మధ్య ఉండే అక్షరాలని 'హల్లులు' అనే పేరుతో పిలుతురని పాణిని స్పష్టంగా సూచించాడు.

ఇట్టి సూత్రములతో ఎనిమిది అధ్యాయాలలో పాణిని మహర్షిచే రచించబడిన తొలి వ్యాకరణ గ్రంథానికి **"అష్టాధ్యాయి"** అని పేరు. ఈ సూత్రాలకే 'వరరుచి' వార్తికాలని, "పతంజలి" భాష్యాన్ని రచించి లోకానికి ప్రసాదించారు. ఇప్పటికీ ఇదే గొప్ప ప్రామాణిక గ్రంథము.!!

* * *

# కోశాభినందనం

ధ్వనుల రూపం అక్షరం. అక్షరాల అర్థవంతమైన కలయిక పదం. పదాల కూర్పు వాక్యం. ఛందస్సు కూడా కలిస్తే పద్యం, పాటా, వచనం వగైరా... అవి పలికించే కవులు ఊహాపోహ విశారదులైనా నిలిచి మనవలసినది నేల మీద కాళ్ళు మోపితే, వాళ్ళు గతానికి న్యాయనిర్ణేతలైనా, వర్తమానానికి కర్మసాక్షులైనా, భవిష్యత్తుకు మార్గదర్శకులైనా ఆ కాలాలన్నీ ప్రాణుల జీవనాలతో ముడిపడి వున్నవే. ప్రతి జీవీ తనకు తానై, తన చుట్టూ ఉన్న జనానికీ, ప్రకృతికీ భావనాత్మక ప్రతినిధియై, ఆలోచనలకు నిధియై ఆ జీవావరణాన్ని సుసంపన్నం చేస్తుంది. ఆ క్రమమో, ఆ ఫలితమో మన మనస్సుల దాకా రావాలంటే వీటి పుట్టుపూర్వోత్తరాలు తెలియాలి. అలా తెలియజేయగలది శబ్దమొక్కటే. శబ్దమే లేకపోతే ప్రపంచమంతా అంధకారబంధురమే అన్నది అందుకోసమే.

శబ్దం ఒక అర్థానికే కాదు, ఒక భావానికీ, ఒక కాలానికీ, ఒక సంస్కృతికీ, ఒక నాగరికతకు, ఒక చరిత్రకు సాక్షిగా నిలువగలది. మానవ జీవన వికాసాన్ని కాలక్రమానుగుణంగా తెలుసుకోవాలంటే పద, తదర్థాల ఉత్పత్తివికాసాలను గురించి తెలుసుకోవటం అవసరం. ఒక కాలానికి చెందిన ఇద్దరు లేక అంతకన్న ఎక్కువ మంది ఒకే పదాన్ని వాడితే వాటి పరిసరభేదం వాటి అర్థభేదాన్నీ తెలుపగలుగుతుంది. ఆ పదం వ్యాప్తిలోకి వచ్చిన కాలాన్ని గుర్తించగలిగితే అది ఆనాటి సంస్కృతికీ, జీవనవిధానానికీ ప్రమాణమై నిలుస్తుంది. వీటన్నింటికీ ముందుగా అవసరమైనది ఆయా కవులు ప్రయోగించిన పదాలనూ పదబంధాలనూ సేకరించి, సమీకరించి ఒక క్రమంలో నిలుపగలగటం. ఇది ఎంతో కాలాన్నీ అవసరం మేర ధనాన్ని, సహనాన్నీ వెచ్చించవలసిన పని. ఇటువంటి పదకోశాలను ప్రధానంగా సంస్థలు చేపట్టి సాహిత్యపాఠక లోకానికి అందిస్తాయి. అప్పుడప్పుడు సహనశీలురై, సమర్థులైన కొందరు వ్యక్తులు కూడా తమ వంతు కృషిని చేసి తమ వరివస్యను సాహిత్య లోకానికి అందిస్తారు.

ప్రాకృతమైన సర్గ – శ్లోక – క్రియానుక్రమణికాకోశం వాల్మీకి విరచితమైన శ్రీమద్రామాయణం లోని సుందరకాండలోని క్రియాస్వరూపాన్ని వివరించే కోశగ్రంథం. సంస్కృతసాహిత్యానికి (వాఙ్మయానికి) సంబంధించి ఇప్పటికే ఎన్నో కోశాలున్నా, ఇంకా ఉండవలసిన వాటి సంఖ్య దానికి చాలారెట్లు ఎక్కువ. ఎన్నో సంస్థలు, ఎన్నో యేళ్ళు కృషి చేస్తేనే గానీ ముగియనంత విషయముంది. ఆ దశలో శ్రీ రావి మోహనరావు గారు ఒక వ్యక్తిగా తన కాలాన్నీ, శ్రమనూ సమన్వయపరచి ఈ కోశాన్ని తయారు చేశారు. సుందరకాండలోని క్రియా స్వరూపాలను విశ్లేషించి చూపే కోశ గ్రంథమిది.

తద్ధితప్రత్యయాల విషయంలోనూ, సుబన్తాలలో లింగనిర్ణయంలోనూ, ధాతువిషయంలో స్వరూపనిర్ణయంలోనూ సంస్కృత పండితులు సందేహాలకు లోనవుతుంటారు. ధాతువుల విషయంలో మరీను. ధాతువులు పదిగణాలు – వాటికి పది వికరణ ప్రత్యయాలు, వాటిలో ఆత్మనేపద, పరస్మైపద, ఉభయపదభేదాలు. కాలాలు మూడే అయినా లకారాలు (అవాంతర కాల విభాగ, విధ్యాదులతో సహ) పది – వాటిలో ఆర్ధధాతువు సార్వధాతుక భేదం, తత్కృతమైన రూప భేదాలు భావంగతంగా కర్తృ కర్మ ప్రేరణ సన్నంత యఙన్త యఙ్లు ఙన్తాదులు – ఆత్మనేపద పరస్మైపదాలలో మరల అటు ఇటు తారుమారులు, ఆయా కారణాలను బట్టి... ఇవన్నీ కలిసి ధాతు స్వరూప నిర్ణయాన్ని క్లిష్టతరం చేస్తాయి.

శ్రీ రావి మోహనరావు సుందరకాండలో ప్రయోగింపబడిన ధాతురూపాల నన్నింటినీ విశ్లేషించి, స్వరూపావగాహనకు సులభమైన బాటను నిర్మించారు. ఇదే క్రమంలో రామాయణం లోని ఇతర కాండలకు కూడా కోశ గ్రంథాలు సిద్ధమైతే వాల్మీకి క్రియాప్రయోగనిధి పాఠకుల కెవరికైనా అనాయాసంగా దక్కినట్లవుతుంది. ఆయా పదాల స్థితిలో ఒక కాల ప్రమాణం దొరుకుతుంది కాబట్టి సాంస్కృతిక వికాస పరిశీలనకు ఆ నిధి దోహదం చేస్తుంది. శ్రీ రావి మోహనరావు గారినీ మనసారా అభినందిస్తూ...

**సూరం శ్రీనివాసులు.**

# సున్దరకాణ్డ

## సర్గానుక్రమణికా

| | | |
|---|---|---|
| 01.001 | తతో రావణనీతాయాస్సీతా | ఇయేష – ఇష. ఇష్. ఇచ్ఛాయామ్ (6), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.002 | దుష్కరం నిష్ప్రతిద్వంద్వం | ఆబభౌ – భా. దీప్తౌ (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఆఙ్+బభౌ |
| 01.003 | అథ వైడూర్యవర్ణేషు | విచచార – చర. చర్. భక్షణేగతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – వి+ |
| 01.007 | స తస్య గిరివర్యస్య | ఆబభౌ - భా. దీప్తౌ (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఆఙ్+బభౌ |
| 01.008 | స సూర్యాయ మహేంద్రా | చకార – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.009 | అంజలిం ప్రాఙ్ముఖః కుర్వన్ | అభివవృధే – వృధు. వృధ్. వృద్ధౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – అభి+వవృధే |
| 01.010 | ప్లవంగప్రవరైర్దృష్టః | వవృధే - వృధు. వృధ్. వృద్ధౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.011 | నిష్ప్రమాణశరీరస్సన్ | పీడయామాస – పీడ. అవగాహనే (10), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.012 | స చచాలాఽచలశ్చాపి | అశాతయత్ – శద్ఌ. శత్/శద్. శాతనే (1), ప.ప. ణిచ్ లఙ్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.013 | తేన పాదపముక్తేన | బభౌ – భా. దీప్తౌ (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.014 | తేన చోత్తమవీర్యేణ | సంప్రసుస్రావ – స్రు. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – సమ్+ప్ర+సుస్రావ |
| 01.015 | పీడ్యమానస్తు బలినా | నిర్వర్తయామాస – వృతు. వృత్. వర్తనే (1), ఆ.ప. – ణిచ్ లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. – నిర్+ |
| 01.016 | ముమోచ చ శిలాశ్శైలః | ముమోచ – ముచ్ఌ. ముచ్. విమోచనే (6), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.017 | గిరిణా పీడ్యమానేన | వినేదుః – ణద. నద్. అవ్యక్తే శబ్దే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. – వి+నేదుః |
| 01.018 | స మహాసత్త్వసన్నాదః | పూరయామాస – పూరీ. ఆప్యాయనే (10), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.019 | శిరోభిః పృథుభిస్సర్పాః | దదంశుః – దంశ. దశనే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.020 | తాస్తదా సవిషైర్దష్టాః | బిభిదుః – భిదిర్. విదారణే (7), ఉ.ప. – లిట్. - ప్ర.పు.బ. - ప.ప. |
| 01.021 | యాని చౌషధజాలాని | శేకుః – శక్ఌ. శక్తౌ (5), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.022 | భిద్యతేఽయం గిరిర్భూతైః | భిద్యతే – భిదిర్. విదారణే (7), ఉ.ప. – కర్మణి లట్. ప్ర.పు.ఏ. - ఆ.ప. |
| 01.022 | భిద్యతేఽయం గిరిర్భూతైః | ఉత్పేతుః – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. – ఉత్+పేతుః |
| 01.025 | కృతకంఠగుణాః క్షీబాః | ప్రతిపేదిరే – పద. పద్. గతౌ (4), ఆ.ప. – లిట్. - ప్ర.పు.బ. – ప్రతి+పేదిరే |
| 01.026 | హారనూపురకేయూర | తస్థుః – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.027 | దర్శయన్తో మహావిద్యాం | వీక్షాంచక్రుః – ఈక్ష. ఈక్ష్. దర్శనే (1), ఆ.ప. వి+ఈక్షాంచక్రుః – 'కృ' అను ప్రయోగం. – లిట్. - ప్ర.పు.బ. - ప.ప. – (సూ. 1.3.63 – ఆం.) |
| 01.028 | శుశ్రువుశ్చ తదా శబ్దం | శుశ్రువుః – శ్రు. శ్రావణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.029 | ఏష పర్వతసంకాశో | తితీర్షతి – తౄ. ప్లవనతరణయోః (1), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. తర్తుమిచ్ఛతి – సన్నంతం |

| | | |
|---|---|---|
| 01.030 | రామార్థం వానరార్థం చ | ఇచ్ఛతి – ఇషు. ఇష్. ఇచ్ఛాయామ్ (6), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. |
| 01.031 | ఇతి విద్యాధరాశ్శ్రుత్వా | దదృశుః – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.032 | దుధువే చ స రోమాణి | దుధువే – ధూఞ్. కంపనే (9), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. |
| 01.032 | దుధువే చ స రోమాణి | ననాద – ణద. నద్. అవ్యక్తేశబ్దే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.033 | ఆనుపూర్వ్యేణ వృత్తం | విచిక్షేప – క్షిప. ప్రేరణే (4), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – వి+చిక్షేప |
| 01.034 | తస్య లాంగూలమావిద్ధం | దదృశే – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. |
| 01.035 | బాహూ సంస్తంభ | సంస్తంభయామాస – స్తమ్భ. ప్రతిఘాతే (5/4) ప.ప. – ణిచ్ లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.035 | బాహూ సంస్తంభ | సంచుకోప – కుప. క్రోధే (4), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.036 | సంహృత్య చ భుజౌ | ఆవివేశ – విశ. విశ్. ప్రవేశనే (6), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఆఙ్+ |
| 01.037 | మార్గమాలోకయన్ | రురోధ – రుధిర్. రుధ్. ఆవరణే (7), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.038 | పద్భ్యాం దృఢమవస్థాం | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. లఙ్. ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.039 | యథా రాఘవనిర్ముక్తః | గచ్ఛేత్ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.039 | యథా రాఘవనిర్ముక్తః | గమిష్యామి – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లృట్. - ఉ.పు.ఏ. |
| 01.040 | న హి ద్రక్ష్యామి యది తాం | గమిష్యామి – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లృట్. - ఉ.పు.ఏ. |
| 01.041 | యది వా త్రిదివే సీతాం | ఆనయిష్యామి – ణయ. నయ్. గతౌ (1), ఆ.ప. – లృట్. - ఉ.పు.ఏ. - ప.ప. – ఆఙ్+ |
| 01.042 | సర్వథా కృతకార్యోఽహం | ఆనయిష్యామి - ణయ. నయ్. గతౌ (1), ఆ.ప. – లృట్. - ఉ.పు.ఏ.- ప.ప. – ఆఙ్+ |
| 01.042 | సర్వథా కృతకార్యోఽహం | ఏష్యామి – ఇణ్. ఇ. గతౌ (2), ప.ప. – లృట్. - ఉ.పు.ఏ. |
| 01.043 | ఏవముక్త్వా తు హనుమా | ఉత్పపాత – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. – ప్ర.పు.ఏ. – ఉత్+ |
| 01.043 | ఏవముక్త్వా తు హనుమా | మేనే – మన. మన్. జ్ఞానే (4), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.044 | సముత్పతతి తస్మింస్తు | సముత్పతతి – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. – సమ్+ఉత్ |
| 01.044 | సముత్పతతి తస్మింస్తు | సముత్పేతుః – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. – సమ్+ఉత్+పేతుః |
| 01.045 | స మత్తకోయష్టిభకాన్ | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.046 | ఊరువేగోద్ధతా వృక్షాః | అన్వయుః - యా. ప్రాపణే (2), ప.ప. – లఙ్. - ప్ర.పు.బ. – అను+అయుః |
| 01.047 | తమూరువేగోన్మథితా | అనుజగ్ముః – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. – అను+జగ్ముః |
| 01.048 | సుపుష్పితాగ్రైర్బహుభిః | బభూవ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.049 | సారవంతోఽథ యే వృక్షాః | న్యమజ్జన్ – టుమస్జో. శుద్ధౌ (6), ప.ప. – లఙ్. - ప్ర.పు.బ. – ని+అమజ్జన్ |
| 01.050 | స నానాకుసుమైః కీర్ణః | శుశుభే – శుభ. శుభ్. దీప్తౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.051 | విముక్తాస్తస్య వేగేన | అవశీర్యంత – శ్యా. హింసాయామ్ (9), ప.ప. – కర్మణి లఙ్. - ప్ర.పు.బ. – అవ+ |

| | | |
|---|---|---|
| 01.052 | లఘుత్వే నోపపన్నం | అపతత్ – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.053 | తారాశతమివాకాశం | ప్రబభౌ – భా. దీప్తౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ప్ర+ |
| 01.054 | తస్య వేగసమాధూతైః | అదృశ్యత – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), గతౌ - ప.ప. – కర్మణి లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.055 | తస్యాంబరగతౌ బాహూ | దదృశాతే – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), గతౌ - ప.ప. లిట్. - ప్ర.పు.ద్వి. -ఆ.ప. |
| 01.056 | పిబన్నివ బభౌ చాపి | బభౌ – భా. దీప్తౌ (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.056 | పిబన్నివ బభౌ చాపి | దదృశే – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. |
| 01.057 | తస్య విద్యుత్ప్రభాకారే | విప్రకాశేతే – కాశృ. దీప్తౌ (1), ఆ.ప. – లట్. - ప్ర.పు.ద్వి. – వి+ప్ర+ |
| 01.058 | పింగే పింగాక్షముఖ్యస్య | సంప్రకాశేతే - కాశృ. దీప్తౌ (1), ఆ.ప. – లట్. - ప్ర.పు.ద్వి. – సం+ప్ర |
| 01.059 | ముఖం నాసికయా తస్య | ఆబభౌ – భా. దీప్తౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఆఙ్+బభౌ |
| 01.060 | లాంగూలం చ సమావిద్ధం | శోభతే – శుభ. శుభ్. దీప్తౌ (1), ఆ.ప. – లట్. - ప్ర.పు.ఏ. |
| 01.061 | లాంగూలచక్రేణ మహాన్ | వ్యరోచత – రుచ. రుచ్. దీప్త ఇచ్ఛాయామ్ (1), ఆ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. – వి+అరోచత |
| 01.062 | స్ఫిగ్దేశేనాభితామ్రేణ | రరాజ – రాజృ. దీప్తౌ (1), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.063 | తస్య వానరసింహస్య | గర్జతి – గర్జ. శబ్దే (1), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. |
| 01.064 | ఖే యథా నిపతత్యుల్కా | దృశ్యతే – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – కర్మణి లట్. - ప్ర.పు.ఏ. |
| 01.065 | పతత్పతంగసంకాశో | శుశుభే – శుభ. శుభ్. దీప్తౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.066 | ఉపరిష్టాచ్ఛరీరేణ | ఆసీత్ – అస. అస్. భువి (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.067 | యం యం దేశం సముద్ర | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.067 | యం యం దేశం సముద్ర | లక్ష్యతే – లక్ష. ఆలోచనే (10), ఆ.ప. – కర్మణి లట్. - ప్ర.పు.ఏ. |
| 01.068 | సాగరస్యోర్మిజాలానామ్ | పుప్లువే – ప్లుఙ్. గతౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.069 | కపివాతశ్చ బలవాన్ | కమ్పయామాసతుః. కమ్పి. కపి (1), ఆ.ప. – ణిచ్ లిట్. - ప్ర.పు.బ. - ప.ప. |
| 01.070 | వికర్షన్నూర్మిజాలాని | పుప్లువే – ప్లుఙ్. గతౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.071 | మేరుమందరసంకాశాన్ | అతి(త్య)క్రామత్ – క్రము. క్రమ్. పాదవిక్షేపే (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ – అతి+అక్రామత్ |
| 01.072 | తస్య వేగసముద్ధూతం | విబభ్రాజ – టుభ్రాజృ. దీప్తౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. – వి+ |
| 01.073 | తిమినక్రఝుషాః కూర్మాః | దృశ్యన్తే – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – కర్మణి లట్. - ప్ర.పు.బ. |
| 01.074 | ప్లవమానం సమీక్ష్యాథ | మేనిరే – మన. మన్. జ్ఞానే (4), ఆ.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.075 | దశయోజనవిస్తీర్ణా | అభవత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.076 | శ్వేతాభ్రఘనరాజీ | శుశుభే – శుభ. శుభ్. దీప్తౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.077 | శుశుభే స మహాతేజాః | శుశుభే – శుభ. శుభ్. దీప్తౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.078 | యేనాసౌ యాతి బలవాన్ | యాతి – యా. ప్రాపణే (2), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. |

| | | |
|---|---|---|
| 01.079 | ఆపాతే పక్షిసంఘానాం | యయౌ – యా. ప్రాపణే (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.080 | పాండురారుణవర్ణాని | చకాశిరే – కాశృ. దీప్తౌ (4), ఆ.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.081 | ప్రవిశన్నభ్రజాలాని | లక్ష్యతే – లక్ష. ఆలోచనే (10), ఆ.ప. – కర్మణి లట్. - ప్ర.పు.ఏ. |
| 01.082 | ప్లవమానం తు తం | వవృర్షుః – వృషు. సేచనే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.083 | తతాప న హి తం సూర్యః | తతాప – తప. సన్తాపే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.083 | తతాప న హి తం సూర్యః | సిషేవే – షివ్. సివ్. తన్తుసన్తానే (4), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. |
| 01.084 | ఋషయస్తుష్టువుః | తుష్టువుః – ష్టుఞ్. స్తుతౌ (2), ఉ.ప. – లిట్. - ప్ర.పు.బ. - ప.ప. |
| 01.084 | ఋషయస్తుష్టువుః | జగుః – గా. స్తుతౌ (3), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.085 | నాగాశ్చ తుష్టువుః | తుష్టువుః – ష్టుఞ్. స్తుతౌ (2), ఉ.ప. – లిట్. - ప్ర.పు.బ. - ప.ప. |
| 01.086 | తస్మిన్ ప్లవగశార్దూలే | చింతయామాస – చితి. చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.087 | సాహాయ్యం వానరేంద్రస్య | కరిష్యామి – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లృట్. - ఉ.పు.ఏ. - ప.ప. |
| 01.087 | సాహాయ్యం వానరేంద్రస్య | భవిష్యామి – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లృట్. - ఉ.పు.ఏ. |
| 01.088 | అహమిక్ష్వాకునాథేన | అర్హతి – అర్హ. అర్హ్. పూజాయామ్ (1), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. |
| 01.089 | తథా మయా విధాతవ్యం | అతిపతిష్యతి – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లృట్. - ప్ర.పు.ఏ. – అతి+ |
| 01.090 | ఇతి కృత్వా మతిం సాధ్వీం | ఉవాచ – వచ. వచ్. పరిభాషణే (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.092 | త్వమేషాం జాతవీర్యాణాం | తిష్ఠతి – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లిట్. - మ.పు.ఏ. |
| 01.093 | తిర్యగూర్ధ్వమధశ్చైవ | ఉత్తిష్ఠ - ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లోట్. - మ.పు.ఏ. – ఉత్+ |
| 01.093 | తిర్యగూర్ధ్వమధశ్చైవ | సంచోదయామాస – చుద. సంబోదనే (10), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. – సం+చోదయామాస |
| 01.096 | కురు సాచివ్యమస్మాకం | కురు – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లోట్. - మ.పు.ఏ. |
| 01.096 | కురు సాచివ్యమస్మాకం | ఉదీరయేత్ – ఈర. క్షేపే (10), ఉ.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. - ప.ప. – ఉత్+ఈరయేత్ |
| 01.097 | సలీలాదూర్ధ్వముత్తిష్ఠ | ఉత్తిష్ఠ - ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లోట్. - మ.పు.ఏ. – ఉత్+ |
| 01.097 | సలీలాదూర్ధ్వముత్తిష్ఠ | తిష్ఠతు – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లోట్. – ప్ర.పు.ఏ. |
| 01.098 | చామీకరమహానాభ! | గమిష్యతి – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లృట్. - ప్ర.పు.ఏ. |
| 01.099 | కాకుత్స్థస్యానృశంస్యం | అర్హసి – అర్హ. అర్హ్. పూజాయామ్ (1), ప.ప. – లట్. - మ.పు.ఏ. |
| 01.100 | హిరణ్యనాభో మైనాకో | ఉత్పపాత – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఉత్+పపాత |
| 01.102 | స మహాత్మా ముహూర్తేన | దర్శయామాస – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – ణిచ్ లిట్. ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.104 | తప్తజాంబూనదైశ్శృంగైః | అభవత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.105 | జాతరూపమయైః శృంగైః | అభవత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.106 | స తముచ్ఛ్రితమత్యర్థం | పాతయామాస – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – ణిచ్ లిట్. - ప్ర.పు.ఏ. |

| | | |
|---|---|---|
| 01.108 | స తదా పాతితస్తేన | జహర్ష – హృష. హృష్. తృప్తౌ (4), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.108 | స తదా పాతితస్తేన | ననంద – టునది. నంద్. సమృద్ధౌ (1), లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.109 | తమాకాశగతం వీరం | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.110 | దుష్కరం కృతవాన్కర్మ | విశ్రమస్వ – విశ్రమ్. శ్రమనే (1), ఆ.ప. – లోట్. - మ.పు.ఏ. - ∗(4), ప.ప. |
| 01.111 | రాఘువస్య కులే జాతైః | ప్రత్యర్చయతి – అర్చ. అర్చ్. పూజాయామ్ (1), ప.ప. – ణిచ్ లిట్. - ప్ర.పు.ఏ. – ప్రతి+అర్చయతి |
| 01.112 | కృతే చ ప్రతికర్తవ్యం | అర్హతి – అర్హ. అర్హ్. పూజాయామ్ (1), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. |
| 01.113 | త్వన్నిమిత్తమనేనాహం | తిష్ఠ – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లోట్. - మ.పు.ఏ. |
| 01.113 | త్వన్నిమిత్తమనేనాహం | గమ్యతామ్ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – కర్మణి లోట్. ప్ర.పు.ఏ. |
| 01.114 | యోజనానాం శతం చాపి | ప్రక్రమతామ్ – క్రము. క్రమ్. పాదవిక్షేపే (1), ప.ప. – లోట్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. – ప్ర+క్రమతామ్ |
| 01.115 | తదిదం గంధవత్ స్వాదు | అనుగమిష్యసి – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – ల్యట్. - మ.పు.ఏ. – అను+గమిష్యసి |
| 01.117 | వేగవంతః ప్లవంతో యే | మన్యే – మన. మన్. జ్ఞానే (4), ఆ.ప. – లట్. - ఉ.పు.ఏ. |
| 01.120 | పూజితే త్వయి ధర్మజ్ఞః | శృణు – శ్రు. శ్రవణే (1), ప.ప. – లోట్. - మ.పు.ఏ. |
| 01.121 | పూర్వం కృతయుగే తాత! | జగ్ముః – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.122 | తతస్తేషు ప్రయాతేషు | జగ్ముః – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.123 | తతః కృద్ధస్సహస్రాక్షః | చిచ్ఛేద – ఛిదిర్. ఛిద్. ద్వైధీకరణే (7), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.127 | అస్మిన్నేవంగతే కార్యే | అర్హసి – అర్హ. అర్హ్. పూజాయామ్ (1), ప.ప. – లట్. - మ.పు.ఏ. |
| 01.129 | ఏవముక్తః కపిశ్రేష్ఠస్తం | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.129 | ఏవముక్తః కపిశ్రేష్ఠస్తం | అపనీయతామ్ – ణీఞ్. నీ. ప్రాపణే (1), ఉ.ప. – కర్మణి లోట్. - ప్ర.పు.ఏ. – అప+ |
| 01.130 | త్వరతే కార్యకాలో మే | అతివర్తతే – వృతు. వృత్. వర్తనే (1), ఆ.ప. – లట్. - ప్ర.పు.ఏ. – అతి+ |
| 01.131 | ఇత్యుక్త్వా పాణినా శైలం | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.133 | అధోర్ధ్వం దూరముత్ప్లుత్య | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.134 | భూయశ్చోర్ధ్వగతిం ప్రాప్య | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.135 | తద్ద్వితీయం హనుమతో | ప్రశశంసుః – శంసు. శంస్. స్తుతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. – ప్ర+ |
| 01.137 | ఉవాచ వచనం ధీమాన్ | ఉవాచ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.138 | హిరణ్యనాభ! శైలేంద్ర! | ప్రయచ్ఛామి – దాణ్. దా. దానే (1), ప.ప. – లట్. - ఉ.పు.ఏ. – ప్ర+ |
| 01.138 | హిరణ్యనాభ! శైలేంద్ర! | తిష్ఠ – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లోట్. - మ.పు.ఏ. |
| 01.140 | రామస్స్యైవ హి దూత్యేన | అస్మి – అస. అస్. భువి (2), ప.ప. – లట్. - ఉ.పు.ఏ. |

| | | |
|---|---|---|
| 01.141 | తతః ప్రహర్షమగమత్ | అగమత్ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లుఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.142 | స వై దత్తవరశ్శైలో | వ్యతిచక్రామ. క్రము. క్రమ్. పాదవిక్షేపే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – వి+అతి+ |
| 01.143 | తతో దేవాస్సగంధర్వా... | అబ్రువన్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.బ. - ప.ప. |
| 01.144 | అయం వాతాత్మజ | ఆచర – చర. చర్. భక్షణే గతౌ (1), ప.ప. – లోట్. - మ.పు.ఏ. – ఆఙ్+చర |
| 01.145 | బలమిచ్ఛామహే జ్ఞాతం | ఇచ్ఛామహే – ఇష. ఇష్. ఇచ్ఛాయామ్ (6) - ఉ.ప. – లట్. - ఉ.పు.బ. - ఆ.ప. |
| 01.145 | బలమిచ్ఛామహే జ్ఞాతం | గమిష్యతి – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – ల్ఋట్. - ప్ర.పు.ఏ. |
| 01.148 | వికృతం చ విరూపం | ఉవాచ – వచ. వచ్. పరిభాషణే (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.149 | మమ భక్షః ప్రదిష్టః | భక్షయిష్యామి – భక్ష. భక్ష్. అదనే (10), ప.ప. – ల్ఋట్. - ఉ.పు.ఏ. |
| 01.149 | మమ భక్షః ప్రదిష్టః | ప్రవిశ – విశ. విశ్. ప్రవేశనే (6), ప.ప. – లోట్. - మ.పు.ఏ. – ప్ర+విశ |
| 01.151 | ఏవముక్తస్సురసయా | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.154 | తస్యాస్సకాశం దూతోऽ | అర్హసి – అర్హ. అర్హ్. పూజాయామ్ (1), ప.ప. – లట్. - మ.పు.ఏ. |
| 01.155 | అథవా మైథిలీం దృష్ట్వా | ప్రతిశృణోమి – శ్రు. శ్రవణే (1), ప.ప. – లట్. - ఉ.పు.ఏ. – ప్రతి+శృణోమి |
| 01.155 | అథవా మైథిలీం దృష్ట్వా | ఆగమిష్యామి – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – ల్ఋట్. - ఉ.పు.ఏ. – ఆఙ్+గమిష్యామి |
| 01.156 | ఏవముక్తా హనుమతా | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.157 | తం ప్రయాంతం | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.159 | ఏవముక్తస్సురసయా | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.160 | ఇత్యుక్త్వా సురసాం | అభవత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 01.161 | తం దృష్ట్వా మేఘసంకాశం | చకార – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.162 | హనుమాంస్తు తతః | చకార – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.163 | బభూవ హనూమాన్ వీరః | చకార – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.163 | బభూవ హనూమాన్ వీరః | బభూవ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.164 | తదైవ హనుమాన్ వీరః | చకార – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.165 | హనుమానచలప్రఖ్యః | చకార – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.167 | స సంక్షిప్యాత్మనః కాయం | బభూవ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.168 | సోऽభిపద్యాథ తద్వక్త్రం | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.169 | ప్రవిష్టోऽస్మి హి తే వక్త్రం | గమిష్యే – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. –ల్ఋట్. ఉ.పు.ఏ. - ఆ.ప. |
| 01.169 | ప్రవిష్టోऽస్మి హి తే వక్త్రం | ఆసీత్ – అస. అస్. భువి (1), ప.ప. – లఙ్. ప్ర.పు.ఏ. |
| 01.170 | తం దృష్ట్వా వదనాన్ముక్తం | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.171 | అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ! | సమానయ – ణీఞ్. నీ. ప్రాపణే (1), ఉ.ప. – లోట్. - మ.ఉ.ఏ. – సమా+నయ - ప.ప. |

| | | |
|---|---|---|
| 01.172 | తత్తృతీయం హనుమతో | ప్రశశంసుః – శంసు. శంస్. (1), ప.ప. - లిట్. - ప్ర.పు.బ. – ప్ర+శశంసుః |
| 01.173 | స సాగరమనాధృష్య | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.175 | సింహకుంజరశార్దూల | ఉపశోభతే – శుభ. శుభ్. దీప్తౌ (1), ఆ.ప. – లట్. - ప్ర.పు.ఏ. – ఉప+ |
| 01.179 | బహుశస్సేవితే వీరైః | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.180 | హనుమాన్ మేఘజాలాని | చకాశిరే – కాశృ. దీప్తౌ (4), ఆ.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.181 | ప్రవిశన్నభ్రజాలాని | ఆభాతి – భా. దీప్తౌ (2), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. – ఆఙ్+భాతి |
| 01.182 | ప్రదృశ్యమానస్సర్వత్ర | భేజే – భజ. సేవాయామ్ (1), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. |
| 01.183 | ప్లవమానం తు తం | చిన్తయామాస – చితి. చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.184 | అద్య దీర్ఘస్య కాలస్య | భవిష్యామి – భూ. సత్తాయామ్ (1), ప.ప. – ల్ృట్. - ఉ.పు.ఏ. |
| 01.185 | ఇతి సంచింత్య మనసా | చిన్తయామాస – చితి. చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.186 | సమాక్షిప్తోఽస్మి సహసా | అస్మి – అస. అస్. భువి (1), ప.ప. – లట్. – ఉ.పు.ఏ. |
| 01.187 | తిర్యాగూర్ధ్వమధశ్చైవ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.189 | స తాం బుద్ధ్వాఽర్థతత్త్వేన | వ్యవర్ధత – వృధు. వృధ్. వృద్ధౌ (1), ఆ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. – వి+అవర్ధత |
| 01.190 | తస్య సా కాయముద్వీక్ష్య | సమభి(భ్య)ద్రవత్ – ద్రు. గతౌ (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. – సమ్+అభి+అద్రవత్ |
| 01.191 | స దదర్శ తతస్తస్యాః | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.192 | స తస్యా వివృతే వక్త్రే | నిపపాత – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ని+ |
| 01.194 | తతస్తస్యా నఖైస్తీక్ష్ణై | ఉత్పపాత - పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఉత్+పపాత |
| 01.195 | తాం తు దృష్ట్వా చ ధృత్యా | వవృధే – వృధు. వృధ్. వృద్ధౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.196 | హ్రతహ్రత్సా హనుమతా | పపాత – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.197 | తాం హతాం వానరేణాశు | ఊచుః – వచ. వచ్. పరిభాషణే (2), ప.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 01.198 | భీమమద్య కృతం కర్మ | సాధయ – సాధ. సంసిద్ధౌ (5), ప.ప. – ణిచ్ లోట్. - మ.పు.ఏ. - ప.ప. |
| 01.199 | యస్య త్వేతాని చత్వారి | సీదతి – షద్ఌ. సద్. విశరణ… (6), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. |
| 01.200 | స తైః సంపూజితః పూజ్యః | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.201 | ప్రాప్తభూయిష్ఠపారస్తు | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.202 | దదర్శ చ పతన్నేవ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.204 | స మహామేఘసంకాశం | చకార – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 01.205 | కాయవృద్ధిం ప్రవేగం చ | కుర్యుః - డుకృఞ్. కరణే (8), ఉ.ప. – విధిలిఙ్. - ప్ర.పు.బ. |
| 01.205 | కాయవృద్ధిం ప్రవేగం చ | మేనే – మన. మన్. జ్ఞానే (4), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 01.206 | తతశ్శరీరం సంక్షిప్య | ఆపేదే – పద. పద్. గతౌ (4), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఆఙ్+పేదే |
| 01.209 | తతస్స లంబస్య గిరేః | నిపపాత – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ని+పపాత |

| | | |
|---|---|---|
| 01.210 | తతస్తు సంప్రాప్య | నిపపాత – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ని+పపాత |
| 01.211 | స సాగరం దానవపన్న | దదర్శ – దృశిర్.దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.01 | స సాగరమనాధృష్యం | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.02 | తతః పాదపముక్తేన | బభౌ – భా. దీప్తౌ (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.03 | యోజనానాం శతం | అధిగచ్ఛతి – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. – అధి+ |
| 02.05 | స తు వీర్యవతాం శ్రేష్ఠః | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.06 | శాద్వలాని చ నీలాని | జగామ – గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.07 | శైలాంశ్చ తరుసంఛన్నాన్ | అభిచక్రామ – క్రము. క్రమ్. పాదవిక్షేపే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – అభి+చక్రామ |
| 02.08 | స తస్మిన్నచలే తిష్ఠన్వ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.13 | సంతతాన్వివిధైర్వృక్షైః | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.18 | తోరణైః కాంచనైర్దివ్యైః | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.19 | గిరిమూర్ధ్ని స్థితాం లంకాం | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.20 | పాలితాం రాక్షసేంద్రేణ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.22 | మనసేవ కృతాం లంకాం | చిన్తయామాస – చితి. చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.26 | తస్యాశ్చ మహతీం గుప్తిం | చిన్తయామాస – చితి. చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.28 | ఇమాం తు విషమాం | కరిష్యతి – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – ల్యట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 02.29 | అవకాశో న సాంత్వస్య | దృశ్యతే – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – కర్మణి లట్. - ప్ర.పు.ఏ. |
| 02.31 | యావజ్జానామి వైదేహీం | జానామి – జ్ఞా. అవబోధనే (9), ఉ.ప. – లట్. - ఉ.పు.ఏ. |
| 02.31 | యావజ్జానామి వైదేహీం | చింతయిష్యామి – చితి – చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – ల్యట్. - ఉ.పు.ఏ. |
| 02.32 | తతస్స చింతయామాస | చిన్తయామాస – చితి. చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.36 | తాం పురీం తాదృశీం | చిన్తయామాస – చితి. చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.37 | కేనోపాయేన పశ్యేయమ్ | పశ్యేయమ్ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – విధిలిఙ్. - ఉ.పు.ఏ. |
| 02.38 | న వినశ్యేత్ కథం కార్యం | పశ్యేయమ్ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – విధిలిఙ్. - ఉ.పు.ఏ. |
| 02.38 | న వినశ్యేత్ కథం కార్యం | వినశ్యేత్ – ణశ. నశ్. అదర్శనే (4), ప.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. |
| 02.39 | భూతాశ్చార్థా విపద్యంతే | విపద్యన్తే – పద. పద్. గతౌ (4), ఆ.ప. – లట్. - ప్ర.పు.బ. – వి+ |
| 02.40 | అర్థానర్థాంతరే బుద్ధిః | శోభతే – శుభ. శుభ్. దీప్తౌ (1), ఆ.ప. – లట్. - ప్ర.పు.ఏ. |
| 02.40 | అర్థానర్థాంతరే బుద్ధిః | ఘాతయన్తి – హన. హన్. హింసాగత్యోః (2), ప.ప. – ణిచ్ లట్. - ప.ప. - ప్ర.పు.బ. |
| 02.41 | న వినశ్యేత్ కథం కార్యం | వినశ్యేత్ – ణశ. నశ్. అదర్శనే (4), ప.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. – వి+ |
| 02.41 | న వినశ్యేత్ కథం కార్యం | భవేత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. |

| | | |
|---|---|---|
| 02.42 | మయి దృష్టే తు రక్షోభిః | భవేత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. |
| 02.44 | వాయురప్యత్ర నాజ్ఞాతః | చరేత్ – చర. చర్. భక్షణే గతౌ (1), ప.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. |
| 02.45 | ఇహాహం యది తిష్ఠామి | తిష్ఠామి – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లట్. - ఉ.పు.ఏ. |
| 02.45 | ఇహాహం యది తిష్ఠామి | హీయతే – హా. గతౌ వృద్ధౌ చ (5), ప.ప. – భావే లట్. - ప్ర.పు.ఏ. |
| 02.46 | తదాహం స్వేన రూపేణ | అభిపతిష్యామి – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – ల్రుట్. - ఉ.పు.ఏ. – అభి+ |
| 02.47 | రావణస్య పురీం రాత్రౌ | ద్రక్ష్యామి – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – ల్రుట్. - ఉ.పు.ఏ. |
| 02.48 | ఇతి సంచింత్య హనుమాన్ | ఆచకాంక్షే – కాంక్షి. కాంక్ష్. కాంక్షాయామ్ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఆఙ్+చకాంక్షే - ఆ.ప. |
| 02.49 | సూర్యే చాస్తంగతే రాత్రౌ | బభూవ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.50 | ప్రదోషకాలే హనుమాన్ | ప్రవివేశ – విశ. విశ్. ప్రవేశనే (6), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.52 | సప్తభౌమాష్టభౌమైశ్చ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 02.53 | వైడూర్యమణిచిత్రైశ్చ | శుశుభిరే – శుభ. శుభ్. దీప్తౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.బ. |
| 02.54 | కాంచనాని చ చిత్రాణి | ఉద్ద్యోతయామాసుః – ద్యుత. దీప్తౌ (1), ఆ.ప. – ణిచ్ లిట్. - ప్ర.పు.బ. - ప.ప. – ఉత్+ |
| 02.55 | అచింత్యామద్భుతాకారాం | ఆసీత్ – అస. అస్. భువి (2), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 02.57 | చంద్రోఽపి సాచివ్యం | ఉత్తిష్ఠతే – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. – ఉత్+తిష్ఠతే – ఉపసర్గాత్ |
| 02.58 | శంఖప్రభం క్షీరమృణాళ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.02 | నిశి లంకాం మహాసత్త్వో | వివేశ – విశ. విశ్. ప్రవేశనే (6), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.12 | వస్వౌకసారాప్రతిమాం | జహర్ష – హృష. హృష్. తృప్తౌ (4), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.13 | తాం సమీక్ష్య పురీం | చిన్తయామాస – చితి. చిన్త్. స్మృత్యామ్ (10), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.15 | కుముదాంగదయోర్వాపి | భవేత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. |
| 03.16 | వివస్వతస్తనూజస్య | భవేత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – విధిలిఙ్. - ప్ర.పు.ఏ. |
| 03.17 | సమీక్ష్య తు మహాబాహుః | అభవత్ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. |
| 03.19 | తాం నష్టతిమిరాం దీపైః | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.22 | పురస్తాత్కపివర్యస్య | అతిష్ఠత – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. |
| 03.22 | పురస్తాత్కపివర్యస్య | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 03.23 | కస్త్వం కేన చ కార్యేణ | కథయస్వ – కథ. కథ్. వాక్యప్రబన్ధే (10), ప.ప. – లోట్. - మ.పు.ఏ. - ఆ.ప. |
| 03.23 | కస్త్వం కేన చ కార్యేణ | ధరన్తి – ధృఞ్. ధృ. ధారణే (1), ఉ.ప. – లట్. - ప్ర.పు.బ. - ప.ప. |
| 03.25 | అథ తామబ్రవీద్వీరో | అబ్రవీత్ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లఙ్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 03.25 | అథ తామబ్రవీద్వీరో | కథయిష్యామి – కథ. కథ్. వాక్యప్రబన్ధే (10), ప.ప. – ల్రుట్. - ఉ.పు.ఏ. |

| | | |
|---|---|---|
| 03.25 | అథ తామబ్రవీద్వీరో | పరిపృచ్ఛసి – ప్రచ్ఛ. ప్రచ్ఛ్ (6), ప.ప. – లట్. - మ.పు.ఏ. – పరి+పృచ్ఛసి |
| 03.26 | కా త్వం విరూపనాయనా | నిర్భర్త్సయసి – భర్త్స. తర్జనే (10), ఆ.ప. – లట్. - మ.పు.ఏ. - ప.ప. – ఉపసర్గాత్ |
| 03.27 | హనుమద్వచనం శ్రుత్వా | ఉవాచ – వచ. వచ్. పరిభాషణే (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.28 | అహం రాక్షసరాజస్య | రక్షామి – రక్ష. రక్ష్. పాలనే (1), ప.ప. – లట్. - ఉ.పు.ఏ. |
| 03.29 | న శక్యా మావజ్ఞాయ | స్వప్స్యసే – ఞిష్వప్. స్వప్. శయే (2), ప.ప. – ల్ళట్. - మ.పు.ఏ. - ఆ.ప. |
| 03.30 | అహం హి నగరీ లంకా | పరిరక్షామి – రక్ష. రక్ష్. పాలనే (1), ప.ప. – లట్. - ఉ.పు.ఏ. – పరి+ |
| 03.32 | స తాం స్త్రీరూపవికృతాం | ఆబభాషే – భాష. భాష్. వ్యక్తాయాం వాచి (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ఆఙ్+బభాషే |
| 03.35 | తస్య తద్వచనం శ్రుత్వా | బభాషే – భాష. భాష్. వ్యక్తాయాంవాచి (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.38 | తతః కృత్వా మహానాదం | తాడయామాస – తడ. ఆఘాతే (10), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 03.39 | తతస్స కపి శార్దూలో | ననాద – ణద. నద్. అవ్యక్తే శబ్దే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.40 | తతస్సంవర్తయామాస | సంవర్తయామాస – వృతు. వృత్. వర్తనే (1), ఆ.ప. – ణిచ్ లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. – సం+వర్తయామాస |
| 03.40 | తతస్సంవర్తయామాస | అభిజఘాన – హన. హన్. హింసాగత్యోః (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – అభి+జఘాన |
| 03.41 | స్త్రీ చేతి మన్యమానేన | పపాత – పత్ఌ. పత్. గతౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 03.42 | తతస్తు హనుమాన్ ప్రాజ్ఞః | చకార – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 03.43 | తతో వై భృశసంవిగ్నా | ఉవాచ – బ్రూఞ్. బ్రూ. వ్యక్తాయాం వాచి (2), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 03.44 | ప్రసీద సుమహాబాహో! | త్రాయస్వ – త్రైఙ్. పాలనే (1), ఆ.ప. – లోట్. - మ.పు.ఏ. |
| 03.44 | ప్రసీద సుమహాబాహో! | తిష్ఠంతి – ష్ఠా. స్థా. గతినివృత్తౌ (1), ప.ప. – లట్. - ప్ర.పు.బ. |
| 03.46 | ఇదం తు తథ్యం శృణు | శృణు – శ్రు. శ్రవణే (1), ప.ప. – లోట్. - మ.పు.ఏ. |
| 03.48 | స హి మే సమయస్సౌమ్య | అస్తి – అస. అస్. భువి (2), ప.ప. – లట్. - ప్ర.పు.ఏ. |
| 03.50 | తత్ప్రవిశ్య హరిశ్రేష్ఠ! | విధత్స్వ – డుధాఞ్. ధా. ధారణ... (3), ఉ.ప. – లోట్. - మ.పు.ఏ. - ఆ.ప. – వి+ధత్స్వ |
| 04.02 | అద్వారేణ మహాబాహుః | వివేశ – విశ. విశ్. ప్రవేశనే (6), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.02 | అద్వారేణ మహాబాహుః | అవపుప్లువే – ప్లుఙ్. గతౌ (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – అవ+పుప్లువే |
| 04.03 | ప్రవిశ్య నగరీం లంకాం | చక్రే – డుకృఞ్. కరణే (8), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ఆ.ప. |
| 04.05 | సేవితాం రాక్షసైర్భీమైః | అభియాయౌ – యా. ప్రాపణే (2), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – అభి+ |
| 04.06 | హసితోత్కృష్టనినదైః | బభాసే – భాష. భాష్. వ్యక్తాయాం వాచి (1), ఆ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.07 | ప్రజజ్వాల తదా లంకా | ప్రజజ్వాల – జ్వల. జ్వల్. దీప్తౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. – ప్ర+ |

| | | |
|---|---|---|
| 04.08 | తాం చిత్రమాల్యాభరణాం | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.08 | తాం చిత్రమాల్యాభరణాం | ననంద – టునది. నంద్. సమృద్ధౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.09 | భవనాద్భవనం గచ్ఛన్ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.10 | శుశ్రావ మధురం గీతం | శుశ్రావ – శ్రు. శ్రవణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.11 | శుశ్రావ కాంచీనినదం | శుశ్రావ – శ్రు. శ్రవణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.12 | ఆస్ఫోటితనినదాంశ్చ | శుశ్రావ – శ్రు. శ్రవణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.13 | స్వాధ్యాయనిరతాంశ్చైవ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.20 | ధ్వజీన్ పతాకినశ్చైవ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.21 | క్షేపణీపాశహస్తాంశ్చ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.23 | శతసహస్రమవ్యగ్రం | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.25 | పుండరీకావతంసాభిః | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 04.28 | భూషితం రుచిరద్వారం | ఆవివేశ – విశ. విశ్. ప్రవేశనే (6), ప.ప. – లిట్. ప్ర.పు.ఏ. – ఆఙ్+వివేశ |
| 04.29 | స హేమజాంబూనదచక్ర | ఆవివేశ – విశ. విశ్. ప్రవేశనే (6), ప.ప. – లిట్. ప్ర.పు.ఏ. – ఆఙ్+వివేశ |
| 05.01 | తతస్స మధ్యంగతమ్ | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.02 | లోకస్య పాపాని వినాశ | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.03 | యా భాతి లక్ష్మీర్భువి | భాతి - భా. దీప్తౌ (2), ప.ప. - లట్. - ప్ర.పు.ఏ. |
| 05.03 | యా భాతి లక్ష్మీర్భువి | రరాజ - రాజృ. దీప్తౌ (1), ఉ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 05.04 | హంసో యథా రాజ | బభ్రాజ - భ్రాజృ. దీప్తౌ (1), ఆ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 05.05 | స్థితః కకుద్మానివ | రరాజ - రాజృ. దీప్తౌ (1), ఉ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 05.06 | వినష్టశీతాంబుతుషార | రరాజ - రాజృ. దీప్తౌ (1), ఉ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 05.07 | శిలాతలం ప్రాప్య యథా | రరాజ - రాజృ. దీప్తౌ (1), ఉ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 05.10 | మత్తప్రమత్తాని సమాకులా | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.11 | పరస్పరం చాధికమాక్షిపన్తి | ఆక్షిపన్తి - క్షిప. ప్రేరణే (6), ఉ.ప. - లట్. - ప్ర.పు.బ. - ఆఙ్+క్షిపన్తి |
| 05.11 | పరస్పరం చాధికమాక్షిపన్తి | క్షిపన్తి - క్షిప. ప్రేరణే (6), ఉ.ప. - లట్. - ప్ర.పు.బ. |
| 05.11 | పరస్పరం చాధికమాక్షిపన్తి | అధిక్షిపన్తి - క్షిప. ప్రేరణే (6), ఉ.ప. - లట్. - ప్ర.పు.బ. - అధి+క్షిపన్తి |
| 05.12 | రక్షాంసి వక్షాంసి చ | విక్షిపన్తి - క్షిప. ప్రేరణే (6), ఉ.ప. - లట్. - ప్ర.పు.బ. - వి+క్షిపన్తి |
| 05.13 | దదర్శ కాంతాశ్చ సమా | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.14 | మహాగజైశ్చాపి తథా | రరాజ – రాజృ. దీప్తౌ (1), ఉ.ప. – లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. |
| 05.15 | బుద్ధిప్రధానాన్ రుచి | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.16 | ననంద దృష్ట్వా స చ తాన్ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.16 | ననంద దృష్ట్వా స చ తాన్ | ననంద – టునది. నన్ద. నంద్. సమృద్ధౌ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |

| | | |
|---|---|---|
| 05.17 | తతో వరార్హాస్సువిశుద్ధ | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.18 | శ్రియా జ్వలంతీస్త్రపయా | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.19 | అన్యాః పునర్హర్మ్యతలో | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.21 | తతః ప్రియాన్ ప్రాప్య | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.22 | చంద్రప్రకాశాశ్చ హి | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.23 | న త్వేవ సీతాం పరమాభి | దదర్శ – దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 05.27 | సీతామపశ్యన్మనుజేశ్వర | బభూవ – భూ. సత్తాయామ్ (1), ప.ప. – లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.01 | స నికామం విమానేషు | విచచార - చర. చర్. భక్షణేగతౌ (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - వి+ |
| 06.02 | ఆససాదాథ లక్ష్మీవాన్ | ఆససాద - షద్ఌ. సద్. విశరణ... (6), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - ఆఙ్+ససాద |
| 06.03 | రక్షితం రాక్షసైర్ఘోరైః | చకాశే - కాశృ. దీప్తౌ (4), ఆ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.13 | సముద్రమివ గంభీరం | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.14 | విరాజమానం వపుషా | అమన్యత - మన. మన్. జ్ఞానే (4), ఆ.ప. - లఙ్. - ప్ర.పు.ఏ. |
| 06.15 | చచార హనుమాంస్తత్ర | చచార - చర. చర్. భక్షణే గతౌ (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.16 | గృహాద్గృహం రాక్షసానాం | చచార - చర. చర్. భక్షణే గతౌ (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.17 | అవప్లుత్య మహావేగః | పుప్లువే - ప్లుఙ్. గతౌ (1), ఆ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.18 | అథ మేఘప్రతీకాశం | పుప్లువే - ప్లుఙ్. గతౌ (1), ఆ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.21 | తథా చేంద్రజితో వేశ్మ | జగామ - గమ్ఌ. గమ్. గతౌ (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.22 | రశ్మికేతోశ్చ భవనం | పుప్లువే - ప్లుఙ్. గతౌ (1), ఆ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.27 | తేషు తేషు మహార్హేషు | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.28 | సర్వేశాం సమతిక్రమ్య | ఆససాద - షద్ఌ. సద్. విశరణ... (6), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - ఆఙ్+ససాద |
| 06.29 | రావణస్యోపశాయిన్యో | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.30 | శూలముద్గరహస్తాశ్చ | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.35 | సహస్రం వాహినీస్తత్ర | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.37 | క్రీడాగృహాణి చాన్యాని | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.38 | స మందరగిరిప్రఖ్యం | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.40 | అర్చిర్భిశ్చాపి రత్నానాం | విరరాజ - రాజృ. దీప్తౌ (1), ఉ.ప. - లిట్. - ప్ర.పు.ఏ. - ప.ప. - వి+ |
| 06.41 | జాంబూనదమాయాన్యేవ | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 06.44 | ప్రాసాదసంఘాతయుతం | ప్రవివేశ - విశ. విశ్. ప్రవేశనే (6), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. – ప్ర+ |
| 07.01 | స వేశ్మజాలం బలవాన్ | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 07.02 | నివేశనానాం వివిధాశ్చ | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |
| 07.03 | గృహాణి నానావసురాజితా | దదర్శ - దృశిర్. దృశ్. ప్రేక్షణే (1), ప.ప. - లిట్. - ప్ర.పు.ఏ. |

